శ్రీ

# భట్టివిక్రమార్కేశ్వరశతకము

తూర్పు గోదావరిజిల్లా, రామచంద్రపురం తాలూకా,

ఆలమూరు నివాసి

పెనుమెత్స మహాదేవ కవిచే

రచియింపఁబడి,

మోదుకూరు నివాసు లగు

కాళ్లూరి దాసయ్యా పంతుల వారి

ద్రవ్యసహాయమున గ్రంథకర్తచే ప్రకటింపఁబడినవి.

మొదటికూర్పు 500 ప్రతులు

రాయవరమున

మల్లిడి సత్తిరెడ్డిగారి శ్రీ మేరీముద్రాక్షరశాలయందు ముద్రితము.

1937



[ వెల రు 0—2—0

శ్రీ

# త్రివిక్రమార్కేశ్వరశతకము

ఇది

తూర్పు గోదావరిజిల్లా, రామచంద్రపురం తాలూకా,

ఆలమూరు నివాసి

## పెనుమెత్స మహాదేవ కవిచే

రచియింపఁబడి,

మోదుకూరు నివాసు లగు

## కాళ్లూరి దాసయ్య పంతుల వారి

ద్రవ్యసహాయమున గ్రంథకర్తచే ప్రకటింపఁబడినది.

మొదటికూర్పు 500 ప్రతులు

రాయవరమున

డి సత్తిరెడ్డిగారి శ్రీ మేరీముద్రాక్షరశాలయందు ముద్రితము.

1937

…టు రిజిష్టరు ]        [ వెల రు. 0 2 0

# పీ ఠి క

సీ. శ్రీకరంబైన యా త్రేయస గోత్రమన్
కాళ్లూరి కులవార్ధి కంధిసుతుడు
సదసద్వివేక భా వావిశేషజ్ఞుండు
మహిని శేషాచలా త్మజ సుతుండు
శ్రీమజ్జగన్నాథ సీతాసతీగర్భ
శుక్తి సంభవ లస న్మౌక్తికంబు
దాసయ్యపంతు లా ఖ్యా సముజ్జ్వలగుణుం
డతులితోదార సా హస ఘనుండు
గీ. యౌవనంబున విఖ్యాతి నంది మోదు
కూరు గ్రామాధికారియై పేరుజెందె
పుత్ర పౌత్రాయు రైశ్వర్య ములు ఘటిల్లి
దనరు సతతంబు నా చంద్ర తారకముగ. 1

మ. కలలో నన్గనవచ్చి వారలగు నీ కాళ్లూరి దాసయ్య పం
తులవా రొక్కదినంబునందు నను మా న్యుంజేయగా బంధుమి
త్రులతో మద్గృహ పావనంబునకు సం తోషంబుతో వచ్చి స్వ
స్థులునై మత్కృతమైన యీశతక మ చ్ఛుంగూర్చి చర్చింపగన్. 2

మ. ధనలోపంబును వెల్లడించితి తద ర్థం బిత్తునంచున్ ముదం
బున వాగ్దానమొనర్చి రందులకు నీ పుణ్యాత్ము నీపట్ల న
ద్దనుజారాతి పదాబ్జచింతనుని స త్యంబైన వ్యాహార వా
హినిచే నొప్పెడువాని గావవలె భ క్తశ్రీ విక్రమార్కేశ్వరా! 3

కం. శ్రీ సదన కృష్ణవేణీ
దాసయ దంపతుల నెపుడు దరుగని సంప
ద్భాసుల జేయుత విలస
ద్ధీసుకవి స్తుతుల పార్వ తీ పర శివుల్. 4

శ్రీ

# భట్టివిక్రమార్కేశ్వర శతకము

శ్రీవిలసదాత్మగురు మ, ద్భావాజ్ఞానాంధతమస పటలార్కుని వి
ద్యావైభవజితసురగురు, చావలి లక్ష్మీనృసింహశాస్త్రి నుతింతున్.

కం. శ్రీరంజిలు ముంతాకుల, వారాశి సుధాకరునకు పరిపూర్ణ నిరా
కారుననునమస్కృతులుఁద, యారసహృదయునకు చన్నయాచార్యునకున్

శ్రీనాగాభరణా పవిత్ర చరణా శ్రీ మజ్జగత్కారణా
నానాజంతు మనోంబుజద్విహరణా నాకాపగాధారణా
సూనాస్త్రామిత గర్వదారణ గణ స్తోమాఖిలత్రాణ చం
డీ నారీరమణా నిరావరణ భ ట్టీ విక్రమార్కేశ్వరా. 1

శా. శ్రీరమ్యుండగు విక్రమార్కుఁడు నినున్ సేవించి వేయేండ్లు భూ
భారంబున్ వహియింపగా వరము సం పాదించుచో భట్టి నా
మారూఢుండయి తద్వరంబు ద్విగుణం బౌనట్లుగా జేయు నా
సారోదారుడు వేడ్క నిన్నిట బ్రతి ష్ఠంజేసె భట్టీశ్వరా! 2

శా. శ్రీ కాశీపురమందు నాదిని ప్రతి ష్ఠించెన్ పునఃకామ్యుడై
శ్రీకంఠా నిను నాలమూరున బ్రతి ష్ఠించెం దదాకారతన్
గాకిం కొక్కట విక్రమార్కుఁడు నినున్ స్థాపించె నేదెల్పు మీ
పాకారి ప్రముఖామరార్చిత పదా బ్జా విక్రమార్కేశ్వరా. 3

మ. ప్రథమంబందు నవిఘ్నసిద్ధికయి తా త్పర్యంబుతో విఘ్నరా
ట్పృథితుంగూర్చి నమస్కరించి పిదపన్ భాషాంగనన్ మన్మనో
రథమొప్ప న్నుతిజేసి యీ శతక ని ర్మాణంబు గావింతు మ
ద్వ్యథలం బాపగ నీదుచిత్తమిక నా ప్రాప్తంబు భట్టీశ్వరా! 4

మ. పిదపన్ మద్గురువర్యులందలచి యా ఽ వెంటన్ సమస్తార్థ కో
విదులన్ సన్నుతిజేసి నీ స్తవము గా ఽ వింతున్ ప్రమోదంబు
మ్మదిలోజెంది భవత్కృపారసము స ఽ న్మానంబుతో జిక్క నీ
పదపద్మభ్రమరత్వ మిమ్మరుచు సాం ఽ బా విక్రమార్కేశ్వరా! 5

శా. స్వామీ మత్ప్రపితామహుండు యొక ప్రా ఽ సాదంబు నిర్మించి నీ
సామీప్యంబున సంస్థితుండగుచు నిన్ ఽ సద్భక్తిబూజించె మున్
క్షేమంబంచు దలంచి మజ్జనకుడ ఽ క్లేశంబుతో భూషణ
స్తోమంబున్ రచియించె గాచెదవటం ఽ చుర్వీ దేవ భట్టీశ్వరా! 6

శా. పూలర్పించె పితామహుండును పితృ ఽ వ్యుం డెన్నియో చిత్రభూ
షాళింగూర్చె మదగ్రజన్ముడును స ఽ మ్యక్చారు శూలాద్యనే
కాలంకారములన్ రచించె ననమ ఽ ర్థాత్ముండ మత్తేభ శా
ర్దూలంబుల్ శతమున్ సమర్పణమొనర ఽ ర్తున్ విక్రమార్కేశ్వరా! 7

మ. పునుకల్ పాత్రలు నేన్గుతోలు వసనం ఽ బుర్వీ లేపనద్రవ్యమె
ల్లను భస్మంబు విభూషణావళులు కా ఽ లవ్యాళముల్ సేవకుల్
పెనుభూతంబులునై మనోహరత గా ఽ వించున్ భవద్రూపమం
చును నత్యద్భుతమంచు బల్కెదరు ప్రా ఽ జ్ఞుల్ నిన్ను భట్టీశ్వరా! 8

మ. శివభక్తుం జిరుతొండ నంబిని బరీ ఽ క్షింపంగ నీ భార్యతో
వివిధోపాయములం గలంచి సుతు న ఽ న్వేషించి వండించుచో
లవమంతైన విచారముంగొనక నిన్ ఽ లక్ష్యంబుతో శంకరా
భవ మాంపాహియటన్న గాచితివి శ ఽ ర్వా విక్రమార్కేశ్వరా! 9

శా. కాలుం డాయువుజెల్లె రమ్మనుచు మా ఽ ర్కండేయునింబట్ట త
ద్బాలుం డాయమునింగనుంగొని భయ ఽ భ్రాంతిన్నినుంజేరి యో
ఫాలాక్షా యని కౌగలింప ననుకం ఽ పన్ గాచి యా సూర్యజుం
గూలంద్రోచి చిరాయువిచ్చితివి నీ ఽ కుంజెల్లె భట్టీశ్వరా! 10

శా. ఈవే సత్యుడ వప్రమేయుడవు నీ ఽ వే నిష్కళంకుండ వీ
వే వేద్యుండవు నప్రతర్క్యుడవు నీ ఽ వే నిర్విశేషుండ వీ

(1) నీ విశ్వంబుల నిండియుండెదవు నీ · వే నిర్వికారుండ వో
దేవా నిన్నెతలంతు నెల్లపుడు భ · క్తిన్ విక్రమార్కేశ్వరా! 11

మ. పరమార్థంబు నెఱుంగు జ్ఞానులు పర · బ్రహ్మస్వరూపంబుగా
విరతిం జెందక విష్ణుభక్తులు మహా · విష్ణుస్వరూపంబుగా
(2) స్థిరులై బల్కెద రెల్ల శైవులు మహా · దేవస్వరూపంబుగా
పరిపూర్ణంబుగ నీ స్వరూపమును నే · భావింతు భట్టీశ్వరా! 12

మ. పుడమిందాల్చిన శేషుడుం గనకగ · ర్భుండున్ నిను బేర్కొనం
దడబాటొందు నెడన్ జడుండ నిను స్తో · త్రంబెట్లు గావించెదన్
వడిచే నేనుగు లేటగొట్టుకొని పో · వన్ నక్క పాత్రేవు గో
రెడి చందంబుగ దే తలంపగ గప · ర్ది విక్రమార్కేశ్వరా! 13

శా. నీలగ్రీవ మహానుభావ కడకన్ · నిత్యంబు నీ కాళ్ళపై
ఫాలంబుంచి నమస్కరించినను గా · వన్ జూడకే నెత్తిపై
గాలన్ రాచి ముఖంబునం దుమియు నా · కన్నప్ప నత్రాహ్యమా
కైలాసం బొగిజేర్చినావట యనం · గ ధ్వాసి భట్టీశ్వరా! 14

శా. దేవాచార్య మహాత్ములన్ ఖలులు వే · ధింపన్ దదశ్రూదక
స్రావంబీ ధరణీస్థలిన్ బడినచో · జావో మహాదుఃఖమో
యీ విశ్వంబు చలించుటో గలుగు భూ · తేశా మహోగ్రుండవై
దేవాది ద్విషులన్ హరింపుము కప · ర్ది విక్రమార్కేశ్వరా! 15

మ. ఉపకారంబు దలంచి నిన్ను గిరిజా · యోషామణింగూర్ప నే
ర్పుపుకోడన్ గుసుమాస్త్రముల్ విడువగా · రుద్రుండవై కామునిన్
త్రిపురధ్వంసన దక్షమారుత సుహృ · న్నేత్రంబుతో గాల్చియున్
గృపతో నేలితి జాణవన్నటను నీ · వే కావె భట్టీశ్వరా! 16

మ. బహుచిత్రంబు భవచ్చరిత్రము వచిం · పన్ నామరూపక్రియా
రహితుండందురు తత్వసంవిదులు స · ర్వజ్ఞుండవే యందు రి
(3) మ్మహిశాస్త్రజ్ఞులు నీమహామహిమ మే · మాడ్కిన్ బ్రశంసింతు నో
యహిభూషా కమనీయదివ్యతరవే · షా విక్రమార్కేశ్వరా! 17

శా. దీనత్వంబున వేవిధంబులను బ్రా ర్థింపంగ గాపాడవా
హా! నీకింత భరంబె యెందర మహా హ్లాదంబు నందింతు వా
రే నా దగ్గర చుట్టముల్ దలపవీ రే చుట్టముల్ గాని వా
రా నాగాభరణా! కరస్థహరిణా! రక్షింపు భట్టీశ్వరా! 18

శా. సాంగా పుత్రకు డెట్లు పల్కినను వా త్సల్యంబుచే విందు మే
నం బుల్కల్ జనియింప తండ్రి సగగన్ రమ్మా యటంచావిరి
తుం బాలుం బ్రమదంబునం గను బ్రమా దోధ్ధమతామన్న చం
దంబొప్పన్ విను పద్యముల్ ముదము జెందన్ విక్రమార్కేశ్వరా: 19

మ. సదయాత్ముండవటంచు దీనజనర క్షా! శీలివంచున్ సమ
స్త దిగీశేశుడవంచు బండితులు ని త్యంబున్ బ్రశంసించుటల్
మదిలో నమ్మితి నీటముంచినను పా లన్ ముంచినన్ నీయదే
గద భారంబు శివార్ధదేహ సురగం గామోహ భట్టీశ్వరా! 20

మ. ధనముం గోరుచుమన్న బిక్షుడవు చి త్రంబైన వస్త్రంబు లి
మ్మనుచుం గోర దిగంబరుండ వురుభూ షానీకముం గోరుకో
(4) న్నను బాముల్ పుఱకల్ సమృద్ధములు నిన్ గాంక్షించెదన్ మోక్షసా
ధనమాత్రమ్మె నినాకొసంగవె మహాత్మా! విక్రమార్కేశ్వరా! 21

శా. నీపాదంబుల బూజసేయుచును సా న్నిధ్యంబునందుండి ని
న్నే పెండ్లాడ దలంచి కామదహనం బీక్షించి పంచాగ్నులు
ద్దీపింపన్ దపముం బొనర్చు గిరిపు త్రిం గాంచి కామించి తో
రా పూర్వార్ధశరీర విస్మృతి నప ర్ణా నాథ భట్టీశ్వరా! 22

శా. ధీరత్వంబు వహించి మించి సుధకై దేవాసురల్ దా మకూ
పారంబున్ మథియించుచో గరళము త్పన్నంబుగా లోకముల్
ఘోరాకారత గాల్చివైచునని సం క్షోభింప నద్దాని నా
హారంబుంబలె మ్రింగి కాచితట యా హా! విక్రమార్కేశ్వరా: 23

మ. ద్వయదోషంబులు లేనిదై గుణపద ద్వంద్వాచ్ఛనోపాత్త మ
వ్యయమై వాక్కునకున్ మనంబునకల భ్యంబై సతంబై సమా

(5) హవ్యయజ్ఞప్రక్రియలన్ విహీనమయి న గ్వర్భాంశ్యహంకారసం
శయమూరంబు భవత్పదాబ్జ దలతున్ సద్భక్తి భట్టీశ్వరా! 24

మ. ఉడురాజార్ధకిరీట నామొడల నీ వుగ్రుండవైనన్ భయం
పడకే దెల్పద మత్పురస్థితుడవై మన్నారికోపాంత నా
సుడవై యస్మగు పాసితుండవగుచున్ శోభిల్లు నీనామమే
మృడ నాకుంటనదీయ భాగ్యమునిదా మా విక్రమార్కేశ్వరా! 25

శా. దైతేయుల్ త్రిపురంబులాయయుని చేతం బొంది దుశ్చేష్ట్య వి
ఖ్యాతిన్ దత్త్రిపురంబులందు నిలువంగా భీతిచే నిర్జర
వ్రాతంబీవె శరణ్యమంచును నమోవాకంబు లర్పింప నో
భూతేశా దహనంబొనర్పవె పురంబుల్ మూటి భట్టీశ్వరా! 26

శా. ఎన్నోజన్మములందు జేయు సుకృతం బీనాటి కీజన్మము
త్కృష్టత్వంబొనరించె గాని సకలార్థంబు లత్యంతమున్
(6) గన్నాడన్ మదకీవె రక్షకుడవై కాపాడకున్నంత నో
యన్నా దిక్కెవరింక నాకు జెపుమయ్యా విక్రమార్కేశ్వరా! 27

మ. హతమోహాంచిత యోగదుర్లభ నిరీహానంద మాదుండి నీ
సతితో నీవు నమస్కరింపమికి దక్షబ్రహ్మ కోపంబుతో
(7) క్రతువుంజేయ నిరీశ్వరంబుగ మహారౌద్రానలోద్భూతుడా
సుతుచే వానిమఖంబుతో గెడపవే శుభ్రాంగ భట్టీశ్వరా! 28

మ. సాగటాలాడి జయించి పన్నిదపు మిం చుంబోడి నిమ్మంచు నీ
దగు లింగాకృతితో వృథా పరుషవాక్యంబుల్ ప్రసంగింప
వగ సంతోషముతో నిరంకుశునకుం బ్రత్యక్షమై రంభ ని
మ్ముగ నర్పించి సముద్ధరించితివి శంభూ విక్రమార్కేశ్వరా! 29

శా. బాధల్ బెట్టెడి తారకాసురునిపై బాణంబుగా నిర్జరుల్
క్రోధంబుంగొని నిన్నలంచుమను నీకుం బుత్రుడై పుట్టునా
డే ధైర్యంబు వహించి గెల్చునన నాడింభున్ బ్రసాదించి త
ద్బాధల్ బాపితివార భీమ సతితాం బాకామ భట్టీశ్వరా! 30

శా. ఈ వీసుండవు పుత్రుడన్నఁగ గదా । ధీసుంకు నీస్వర్ణదీ
దేవిం జూడ త్రిలోకపావని యగున్ । దేహార్ధముంగొన్న యీ
దేవేంగన సర్వమంగళ భవ । చ్ఛీర్షస్థ డా రాజహం
సీవిశ్వోన్నతి నెన్నగా దరమె తం । త్రి! విక్రమార్కేశ్వరా! 31

మ. నలినాప్తాబ్జ విరించి కేశవ దిశా । నానామర వ్రాత భూ
జల వైశ్వానర వాయు పుష్కరములన్ । సర్వంబునం దీవు ని
(8) ర్మలతత్త్వంబున నొప్పుచుందువని యి । మ్మాడ్కిన్ సముత్సాహినై
కలుమారుం బ్రణమిల్లుచుంటి సతతాం । బానాధ భట్టీశ్వరా! 32

మ. గురుబోధాత్త విశుద్ధమార్గమును గ । న్గోలేక నుచ్ఛిత్త మ
స్థిరతన్ వత్సజ మర్గమాంచిన నధూ । దేహాటవీమధ్య త
(9) స్కరరూపస్మరమాయలం దగిలి సం । సారాంధకారంబునం
దెరవుం గానని కెట్లుగా చెదవో యు । క్తిన్ విక్రమార్కేశ్వరా! 33

శా. శివింజూపుచు దారుకాఖ్య వనవా । టీ మౌని భార్యా లస
ద్భావంబుల్ వికలంబు జేయుటకు కం । దర్పానల జ్వాలలన్
లావెల్లం దొరగించి మన్మథవిలో । లక్రీడలం దేలుటల్
భావింపంగ విటత్వమూన నెటు సం । భావింతొ భట్టీశ్వరా! 34

శా. చర్మాస్థివ్రజ రక్తమాంస కఫ పుం । జంబైన భామాంగమున్
ధర్మాంగంబని గాఢమోహ వివశ । త్వంబంది వర్ణించి దు
(10) ష్కర్మంబుం బచరించువాడు తుద ని । సాయుజ్యముం బొందునే
ధర్మాధర్మవిదుండవు దక్క గణనా । థా! విక్రమార్కేశ్వరా! 35

మ. తలిదండ్రుల్ నిజ పుత్రమిత్రులు కళ । త్రం బాప్తవర్గంబు వి
శ్చలమంచున్ సుఖదుఃఖలోలుడగుచున్ । సద్భక్తి నిన్నెప్పుడుం
(11) దలపం బోవక నీయనుగ్రహము నొం । దంజాలకే జన్మముం
దొలగంజేసికొనంగ నేరమిని మ । ర్త్యుండెన్న భట్టీశ్వరా! 36

మ. వినుమేకత్వము నీకు నామములను । క్వం నాను నామంబు వాం
ఛను మైకాల్యము గోరుచుంటిని మహా । దేవా ననుం గావ నీ

(12) వనుకంపామతితో జెలంగిన దయా ఽ యత్తుండవై యుండు మా
వనదీనావన భక్తసన్నుత పదా ఽ బ్జా విక్రమార్కేశ్వరా! 37

శా. కాటుంబంను దిటంబు తప్పి తరి ఽ గందోయి చూపుండగా
పాయుంబుండగ గాలుసేతులు మెద ఽ ల్వ్రాజాలి ముంతంగ సా
(13) కీయోద్యగ్రహణాంబు కర్ణముల కెం ఽ తే తెన్నమైనుండగా
నీ యుగ్రుముల్ వినుతి పగావలెజుమీ ఽ విత్యాంబు భట్టీశ్వరా! 38

శా. కాలంబల్పము విఘ్నముల్ బహుళముల్ ఽ గ్రంధంబులంగాంచినన్
వేలుంలక్షలు విస్తరం భరము వా ఽ రింజీడి తత్సారముం
(14) న్వాలీనాంబువులం ద్యజించుము బయుం ఽ పానంబు హంసంబు సే
లీలం గోరునో కోరునట్లు గుణిహో ఽ ళీ విక్రమార్కేశ్వరా! 39

మ. విరహంబుంగొని బ్రాహ్మణుండ నగుచుం ఽ వచ్చేయు విన్నావ సు
స్థిరతం గుండను దాచ గాడ చెలి ర ఽ క్తిం భర్త కల్లందు బో
సి రయుంబొప్పగ గాచుటల్ విమలమా ఽ చిత్తంబుతో వేశ నీ
వరలింగాకృతి జూపి గానవె సురా ఽ ధ్యాండేశ భట్టీశ్వరా! 40

మ. విటసంకర్షము లేని రోవెలది న ఽ న్వేషించి యుత్రాప్తిమై
విటమాపోజ్వల జంగమేశ్వరునకున్ ఽ స్వీయాంగ నారత్నమున్
స్ఫుటమా భక్తినొసంగు శైవమతదీ ఽ క్షున్ భవ్య భక్తాను నెం
తటితీవ్రంపు పరీక్షజొన్పతి మహా ఽ త్మా విక్రమార్కేశ్వరా! 41

శా. ఆహారంబున క్రీడ నిద్ర పశు సా ఽ మ్యం బొందు చుందున్ నర
వ్యూహంబైన విశేషమై నరుల కొ ఽ ప్పున్ బుద్ధియేతన్మ నీ
(15) షా హీనంబు పశూపమానమె యనం ఽ శంకింపగారాము దు
ర్మోహాంధ్యంబున విస్తలించియెటులన్ ఽ బూజింతు భట్టీశ్వరా! 42

శా. ప్రారబ్ధంబు నశించు భోగముం న ఽ తత్త్వజ్ఞాన సంపత్తి వి
స్తారంబైన సమస్త సంచితము దం ఽ గ్ధంబై జనుం బూర్తిగా
(16) దారిద్ర్య ప్రియముల వినోదులను బొం ఽ దంసీంతు నా గామి త
ద్దీరుం డంతట జన్మసూన్యుడగు గా ఽ దే విక్రమార్కేశ్వరా! 43

మ. పదరుంజాలోతమై యెల్లలోకములు వి ధ్వంసంబు గావింప నే
భృదయంబుల్ దయచేయ గాదలచి నా కాకోలతుల్ గొంచు ద
త్రిదశానీకము భీతిలంగ తన శ క్తిన్ జూపి యొంతేని దు
ర్గముడౌ నా మహిమాసురుం దునుము దు ర్గానాధభట్టీశ్వరా! 44

మ. బడబాగ్నిం గరమందుబట్టి త్రుటిలో బట్టింపగావచ్చు త
జ్జలధిన్ లంఘనమాచరింప నగు భా తాళంబునుంజేర గా
(17) ల్నడతో బోవగవచ్చు గాని పరిపూ ర్ణంబైన నీ తత్త్వ మే
ర్పడ గాంచగను దుర్లభంబగును గు ద్రా విక్రమార్కేశ్వరా! 45

శా. నీ కల్యాణగుణాదికంబులను వ ర్ణింపంగ నూహించి నే
నా కావ్యంబునకుం గృతీశ్వరుని జే యం బూను కొన్నాడవిన్
శ్రీకంఠా తగుదీవు మోదమున దా నిం బూర్తిగావింపగా
నా కుత్సాహము సొంగ వేడెద నప ర్ణానాధ భట్టీశ్వరా! 46

శా. కన్నుంగానక దుష్కృతంబుల నసం ఖ్యాకంబుగా జేసి యా
పన్నుండై మృతి నొంది కాలుని భటుల్ బాధించు కాలంబునం
(18) దన్నల్లమ్ములు తల్లిదండ్రులును భా ర్యాపుత్ర మిత్రాదులా
పన్నుంగావగ లేరు నీ పగిది శ ర్వా విక్రమార్కేశ్వరా! 47

మ. సతతాఖండ మనంతమై చతుర వ స్థల్ మీరియున్నట్టి యా
స్థితి. నెన్నంగ చతుశ్శరీరములు గా జెప్పంగ రాదద్ది స
(19) మ్మతితోడన్ శివుడే గురుండనుచు సం భావింప సిద్ధించుటల్
గతినీవేయని నమ్మినాడ గనుమీ కావంగ భట్టీశ్వరా! 48

మ. మృగ మాతంగ పతంగ భృంగములు నా మీనంబు నైదైదు చే
దెగుచుండన్ విషయేంద్రియంబు లయిదుం దీపింప గానక్కడై
(20) దిగులుంబొందు నరుండుపో దడె స్మృతిన్ దీనత్వమే పోక నో
దిగధీశాధిప నన్నుగావవె కప ర్ది విక్రమార్కేశ్వరా! 49

శా. వారిన్ వీరిని వేడు కొనుచును వి న్నర్థింపగా రాదొకో
వారల్ వీరలొనర్చు స్తోత్రము నొన ర్పం జాలనే నీవు సం

పారాంభోనిధి మగ్నులన్ మనుపగా । జాల్వేలు పెవ్వాండవో
పారావారపరీత భూస్థలిని స । ర్వత్రాణ భట్టీశ్వరా! 50

శా. ప్రత్యక్షుం బరమా పదం బనెను ప్రా । బల్యంబ బరీక్షింప దా
న్యాంతాప్తి సమానరాన్యత నపే । క్షా భావముం బొంది త
(21) త్సిత్యంబేదియటంచు సాధన చతు । ష్క ప్రాజ్ఞుడై గాంచు నా
నిత్యానిత్యములందు నిత్యుడవు ని । న్నే విక్రమార్కేశ్వరా 51

మ. మతిమంతుండు గురుక్రమాగతలసన్ । మార్గోపదేశంబునా
బ్రతిబంధ త్రయమును దగులొ్కనకయే । పంచభ్రమంబూడ్చి ని
(22) ష్ప్రతిమోగానుభవజ్ఞుడై తుద బుధ । జ్ఞానంబు శేనుండు నా
స్థితియందున్ గుఱువంచు నిన్నెలుతున్ । జేకొమ్ము భట్టీశ్వరా! 52

మ. అకళంకుండు గురుండు చెల్పగను సాం । ఖ్యంబు స్వచారించి తా
రకమందున్న విచిత్రచిత్కళల మా । ర్గంబుల్ విలోకించుచున్
(23) సకలావస్థలయందు నిల్చి నమన । స్కంబెట్టిదో చూచి పా
యక నిర్బాహ్యుడవై సనిస్ధలతు న । య్యా విక్రమార్కేశ్వరా! 53

శా. కామంగుడ్డయు లేనివాడ నని సం । కోచంబు నాకేల నే
వాడల్ వాడలకేగుచుండిన మనో । వాక్కాయకర్మంబులన్
వేడంజూచెద నీ కటాక్షమును జూ । పింపంగదే చంద్రకు
శ్చ్యాడాకర్తవు సర్వసంపదలకున్ । జోద్యంబు భట్టీశ్వరా! 54

శా. ఈశా ధూర్జటి చంద్రశేఖర గణా । ధీశా మహాదేవ భూ
తేశా శూలి గిరీశ మారహర భీ । మేశా విరూపాక్ష గౌ
రీశా శర్వ వృషధ్వజా పశుపతీ । యీశాన మృత్యుంజయా
శ్రీశంభూ గిరిశా మహేశ్వర కప । ర్ది విక్రమార్కేశ్వరా! 55

మ. తగుమాత్రంబు బఠింపలేనయితి ఛం । దశ్శాస్త్రభాగంబు నే
టుగ కావ్యంబులు నాటకంబులు నిఘం । టు ప్రాతముంగాంచ నో
ప్పుగ శబ్దార్థ వరప్పురాన్వయము సాం । పుంగాంచ లేదింక నీ
దగు కారుణ్యముచే రచించి శతకం । బర్పింతు భట్టీశ్వరా! 56

మ. గుడిగట్టించిన గొన్నినాళ్ళకయినం గూలుం దటాకం బటుల్
జెడు గూపంబన బూడిపోవు వనముల్ శీర్ణంబగున్ సర్వదా
చెడకుండంగ జెలంగుచుండును కృతుల్ చెప్పంగ నందెన్న నో
మ్మృత భావత్కయశంబు సుస్థిరము సుమ్మీ విక్రమార్కేశ్వరా! 57

శా. శ్రీరాజీవ నికేతనాధిప సురజ్యేష్ఠామరేంద్రాంబుధి
ద్వైపాయి బ్రహ్మమునీంద్ర గీష్పతి సరస్వత్పుత్రికా వాక్పతీ
వారాసర్వ కిరీటరత్న సుషమా భాస్వత్పదాంభోరుహా
గౌరీమానస పద్మభాస్కర నమస్కారంబు భట్టీశ్వరా! 58

శా. నీభక్తుండిభదైత్యు డెట్టులరిగా నీకయ్యె నౌగాక ని
వేధంగిం దెగటార్చ నెంచితి వతం డేరీతిగా చర్మముఁ
భూభృద్వాస ధరింపగోరె నెటులా మోదించి గైకొంటి వా
హా భక్తాదర నాగచర్మవసనా ఖ్యాఁ విక్రమార్కేశ్వరా! 59

మ. మొలదోలుంగలవాడ నియడుగు దమ్ముల్ వట్టి గొండాడు నా
కిలు వేల్పుంబలె నుండి గారవముతో నేమాడ్కి గాపాడెదో
పలుకంగా నలుకేల నాజతనముం బాటింపగారాదె వే
ల్పులలో జెట్టివినీవ ముమ్మొగ్గనల వా లందాల్ప భట్టీశ్వరా! 60

మ. తెలిగట్టుంగల దిట్ట వీవనుచు బత్తిం గొల్చుచున్నాడ ద
ప్పులమన్నింపుము దండముల్ గొనుచు మోమోటంబు చేనైన నీ
వలుగన్ ముజ్జగముల్ వడంకును గదయ్యా ముందుగా మిత్తికై
పలు బాముల్ బడుబత్తుడన్ మనుపుము ప్పా విక్రమార్కేశ్వరా! 61

శా. తేరా కాశ్యపి చక్రముల్ రవివిధుల్ దేవాద్రివిల్ శేషుడా
నారెన్నఁ నిగమంబు లశ్వములు తూణంబు బుధుల్ విశ్వసృ
ట్సారథ్యంబు జనార్దనుండు శరమా శక్రుండు భృత్యుండుగా
నీకుంజేయవొకో పురత్రయ మొగిన్ నేత్రాగ్ని భట్టీశ్వరా! 62

శా. కాలంగొట్టిన లెద్దు చేకొనుచు శీర్షంబందునన్ మొత్తినన్
లీలన్ రోకటిచేత గ్రుమ్మినను కాలిన్ నెత్తిపై మోపినన్

కైలాసంబునొసంగి శైలతనయుం । గానుంచు నిగ్గూర్పగా
బాలన్ వైచినబూదిసేయుటదియే । మో విక్రమార్కేశ్వరా! 63

మ. తమి దుష్కార్యములన్ మరల్చి హితము । త్యంతంబునూహించి గు
హ్యము గోప్యంబొనరించి సద్గుణములన్ । వ్యాపింపగాఁజేసి స
(24) త్యముగా జూచి భవత్పదంబునుం విప । త్కాలంబునన్ వీడకే
సను చుంబాసు నొసంగు సద్ధితుడహో । సర్వజ్ఞ భట్టీశ్వరా! 64

మ. తృణ వారి ప్రమదప్రియంబునను తృ । ప్తింగాంచుచుంచ న్మృగీ
గణ మీనోత్కర సాధుకోటి శబరుల్ । కైవర్తకుల్ దుర్జనం
(25) బణుమాత్రంబు దలంకకేచుటకునై । యత్నింతు రూహించి కా
రణమే లేనివిరోధులన్ మనుము శ । ర్వా విక్రమార్కేశ్వరా! 65

శా. త్యాగంబుం బచరించి యాశలను స । త్సాంగత్య మత్యంతమున్
సాగింపన్ వెను వెంటనే గలుగు ని । స్సంగంబు నిస్సంగమున్
(26) సాగింపంగ దనంతటన్ వెస దట । స్థంబౌచు నిర్మోహమే
రాగా నిశ్చలతత్త్వమందు పరిపూ । ర్ణంబీవె భట్టీశ్వరా! 66

శా. సద్రూపా కులహీనునిం గొలుము రా । జద్రోహియైనవాడు రా
జద్రోహిన్ గొలుచున్ వినిశ్చల మని । మన్ మిత్రవిద్రోహి మి
(27) త్రద్రోహిన్ గురుతల్పగుండెనయు స । త్యంబౌగురుద్రోహు మా
తృద్రోహుండు నుతించునిన్ననక భ । క్తిన్ విక్రమార్కేశ్వరా! 67

మ. మునిసంపూజిత మూర్తయే నిఖిల సం । పూర్ణాయ భీమాయ తే
వనజాతాద్యమరార్చితాయ మఖ వి । ధ్వంసాయ రుద్రాయ పా
వన గౌరీపతయే నమోస్తు నిరతం । భర్గాయ తుభ్యం నమో
యని నీపాదములం దలంతు వృషవా । హా శర్వ భట్టీశ్వరా! 68

మ. సితికంఠాయ మహేశ్వరాయ గిరిజా । సీమంతినీపాయ స
న్నుతరూపాయ భవాయ భక్తజనతా । నూనానురాగాయ తే
గత మోహాయ కపర్దినే గుణలిహే । గంగాకళత్రాయ తే
హృతకామాయనమోయటందు వృషవా । హా విక్రమార్కేశ్వరా! 69

శా. భక్తాభీష్ట ఫలప్రదుండవని సం భాషింపగా బెద్దలా
సక్తిం బద్యశతంబుచేత నిను న శ్రాంతంబు ప్రార్థింతు నే
(28) యుక్తిన్నన్ను సముద్ధరించెదవొ నే నూహింపగాజాల నా
శక్తిన్నీవు పరీక్ష సేయుచలదో సర్వజ్ఞ భట్టీశ్వరా! 70

శా. జారుండందురు నన్ను గొందరు మహా జారాగ్రగాముల్ సదా
చారుండందురు నన్ను గొందరు సదా చారోత్తముల్ ప్రేమతో
(29) జోరుండందురు నన్ను గొందరు మహా చోరావతంసుల్ మరె
వ్వారే మన్నను నీదుభక్తుడను శ ర్వా విక్రమార్కేశ్వరా! 71

మ. ఎరుకే సర్వచరాచరంబు లజకృ ష్ణేంద్రాది దేవౌఘ మా
యెరుకే భూతములై దనంగ నెరుకే దృశ్యప్రపంచంబు నా
(30) యెరుకే జీవుడు నీశ్వరుండు నెరుకే యీ సర్వమందుండి య
స్థిరమౌటం బరిపూర్ణ మీ వచలపు శ్రీనాథ భట్టీశ్వరా! 72

మ. ఎరుకన్ వీడుటకున్ జయించుటకు మా యింపింప నెవ్వారికిం
దరమా ప్రాగ్భవపుణ్యదీప్తి దనయా దార్ఢ్యంబు దాగాంచి య
(31) స్థిరమాయం దుదకుం దనంతటనె దా క్షీణించి నష్టంబగున్
పరిపూర్ణంబుగ నీవెవెల్చెదవు సాం బా విక్రమార్కేశ్వరా! 73

శా. వీడో పూజ్యుడు వీడపూజ్యుడని భా వింపండు సౌశీల్యమే
జాడన్ జూపడు నీచవర్తనములన్ సాగించు కృత్యంబులన్
గూడుం గూడదటంచు బుద్ధిని కృత ఘ్నుండెంచడో చంద్రమ
శ్చూడా నీవెసమస్తముంగ నెరు దు ష్టుల్ గూల భట్టీశ్వరా! 74

శా. సారాసార వచఃప్రసక్తి దనరున్ సత్యం బసత్యంబు నొ
ప్పారున్ దానమదానముం గలుగు జీ వంబిమ్ములల్ దీయుటల్
మీరున్ దుర్వ్యయసంగ్రహంబులను ప్రే మించున్ విరాణ్ణీతిత
ద్వారస్త్రీవలె మమ్ము గావుమిక శ ర్వా విక్రమార్కేశ్వరా! 75

మ. అసమానాంబక లోకమెల్లగని యో హో యంచు మెచ్చంగ హా
గ్రసముం జిల్కుచు మేకవన్నెపులులై కాంక్షన్ వదీష్టాతులై

(32) భసితంబున్ మెయిబూసి బొలిసులోన ఁ ర్వాజామ పూజాది మా
నస పూజావిధికిన్ సమంబెటు లవ ఁ ర్ణానాథ భట్టీశ్వరా! 76

మ. తొలుదొల్త లింబ్రసవించు కాలము నయాం ఁ కున్ రుద్రభూమిన్ వివే
కులు పౌరాణికులుచ్చరించుగతి వా ఁ గ్రూపావు వై రాగ్యముల్
(33) బలిబుచ్చంగ దిరంబదెట్లులగు నే ఁ విపంగ శాస్త్రజ్ఞులన్
జలనంబ దక విల్చి నీపద ముకే ఁ శా విక్రమార్కేశ్వరా! 77

శా. నిన్నే ప్రొక్కితి నిన్నె గాంచితిని ని ఁ న్నే ధ్యానముం జేసితిన్
నిన్నే పిల్చితి నిన్నె కోరితిని ని ఁ న్నే పూజ గావించితిన్
(34) నిన్నే వింటిని నిన్నె వేడితిని ని ఁ న్నే చేరగా నెంచితిన్
నిన్నే నమ్మితి నేమిజేసెదో భవా ఁ నీలోల భట్టీశ్వరా! 78

శా. ఏరీతిన్ నిను సంస్మరింతును భుజం ఁ గేశ స్తవాతీత నే
నేరీతిన్ నినుజూతు నేత్రములతో ఁ నేరీతిగా భక్తితో
(35) నారాధింతు మహాస్వరూపుడవు ని ఁ త్యానంద రూపుండ వో
గౌరీమానస పద్మభాస్కర యవ ఁ క్రా విక్రమార్కేశ్వరా! 79

మ. తనువుల్ బుద్బుదముల్ దురంతమగు వా ఁ త శ్లేష్మపైత్యంబులో
క్క నిమేషంబున బొంగి కంఠగతమౌ ఁ కాలంబునందెట్లు నిన్
(36) వినుతింపంగలరట్టులౌటనె సుఖా ఁ న్వితస్థితిన్ స్వస్థులై
నినుబూజించిన ముక్తినిచ్చెదు భవా ఁ నీలోల భట్టీశ్వరా! 80

మ. పలుకుల్ బల్కిన నేమిలాభము మనో ఁ వాక్కాయకర్మంబులం
దలపంగావలె నిర్మలాత్ముడు చల ఁ త్వంబంద కత్రాంతమున్
(37) పలుబాముల్ బడుచుండినం దుదకు కై ఁ వల్యంబు నేకూర ని
శ్చలభక్తిన్ నినుగొల్వగావలె మహే ఁ శా! విక్రమార్కేశ్వరా! 81

శా. రాజుల్ గర్వసమంచితుల్ పరులనం ఁ బ్రజ్ఞావిహీనాత్ములే
యోజంజూచిన దీర్ఘమత్సర సము ఁ ద్యుక్తుల్ ప్రబోధజ్ఞు లౌ
(38) రాజీర్ణించె సుభాషితంబు నిజగా ఁ గ్రంబాదవంగా బుధుల్
రాజీవాక్ష హితా నినుంగన సము ఁ ద్ధంబౌనె భట్టీశ్వరా! 82

శా. నీయందుఁ భయభక్తులుంగలుగు వా నిం బాడుగా జేసి తా
నేయోజన్ భయభక్తులన్ నిలుపు నా హీనాత్ము డిభ్యాదిఁ గా
(39) మోయన్ గర్భగుడంచు నెన్నబడు బ హ్వబ్రోపమానుండు తా
నీయంజాలఁడొ సంగమీయఁడను యా యిన్ విక్రమార్కేశ్వరా! 83
మ. సతతంబున్ గతజన్మమందు మదమా త్సర్యంబులన్ జేయుచు
మ్మృతశేషంబున మాతృగర్భ నరక క్లేశంబుం బొంది వి
(40) గ్గతుఁడై మూత్రపురీషసిక్త తనుఁడై ఖేదాగ్నిఁ గాలంబొర్లుచుం
గతి నీవే యని బాల్యమందెటు లెరుం గంజాలు భట్టీశ్వరా! 84
మ. స్తనపుష్పస్తబకంబులన్ ముఖ సరో జంబున్ వచో నైపుణిన్
గనులన్ జఘనములన్ గళంబనెడు శం ఖంబున్ విలోకించి నా
(41) రిని బొందం గమకించు యౌవన మదో ద్రేకంబుచే యౌవనం
బున నిన్నెట్లుదలంచువాఁడవుదు శం భూ! విక్రమార్కేశ్వరా! 85
శా. కాయంబెల్ల వణంకుచుండు నడువం గా బాదముల్ దొట్రిలున్
బాయుం గంటికిజూపు కర్ణములు శ బ్దజ్ఞానశూన్యంబులౌ
(42) పాయంబెల్లనశించు బుద్ధి వికల త్వంబందు నేరీతిగా
నీయందుంచు మనంబు వృద్ధుడు భవా నీ లోల భట్టీశ్వరా! 86
శా. అజ్ఞానోగ్రతమంబునం దెరవు బా ల్యంబం దలభ్యంబు త
త్త్వజ్ఞానంబు వయఃప్రపూర్ణునకు బ్రా ప్యంబెట్లు వృద్ధుండు బ్ర
(43) హ్మజ్ఞానుండగుటెట్లు మూఢ గత జ న్మశ్రేయమొక్కండె స
ర్వజ్ఞున్నిన్ను స్మరింపజేయవలె రు ద్రా విక్రమార్కేశ్వరా! 87
మ. చలతన్ వీడి కనుల్ మొగిడ్చి నిశలన్ షట్సాంఖ్య నొప్పారు ము
ద్రలలో జిత్కళలందు వెన్నెలను శ బ్దబ్రహ్మ మానాదమై
(44) చెలువొందన్ బరిపూర్ణమంచుదమి భా పింపంగ వైరుధ్య మా
వల విశ్వబ్ధమె బ్రహ్మమంచునుశ్రుతుల్ భాషింప భట్టీశ్వరా! 88
మ కవికాంతాలత చేత నీ శతకమాం గావించితిన్ పార్వతీ
ధవ యాల్మాదున శాలివాహన శకా బ్దంబుల్ మునిప్రాణ ది

గ్ధవరత్నాకరపుత్రసంఖ్య (1857) కనుయు క్తంబాయువాబ్దోర్జనం
వభ తత్పూర్ణిమ నీ కొసంగితిని శ ర్వా విక్రమార్కేశ్వరా!89

శా. నీతత్వంబు గ్రహించు మానవునకు న్నిందాస్తుతుల్ దుల్యమై
ప్రీతింగూర్చు సమస్తకార్యముల ని ష్ప్రీతిం బ్రవర్తించు ద
(45) ద్రీతిన్ దాదృశులే గ్రహింపవలె ద ర్కింపన్ ఫలాపేక్షతో
జేతంబొప్పమియే భవత్పదము చ ర్చింపంగ భట్టీశ్వరా! 90

శా. దైతేయాంతక శౌర్యధుర్య నమితో ద్దండామరాహార్య సం
ప్రీతాదిత్య సమస్తకార్య విధి చ క్రి ప్రస్తుతౌదార్య వి
ఖ్యాతామేయ పటిష్ఠ ధైర్యకరుణా గాంభీర్య వేదాంత వి
ద్యాతన్వీ హృదయాబ్జసూర్యఘనవీ ర్యా విక్రమార్కేశ్వరా!91

మ. పరిపూర్ణస్థితి నందగోరిన మహా భవ్యుండు శ్రద్ధాళుడై
యరిషడ్వర్గమణంచి తచ్ఛమ దమా భ్యాసంబు గావించుచున్.
(46) గరమొప్పారెడు నీమణత్రయములన్ ఖండించి నీవాటి స
ద్గురునింజేరి ప్రబోధమందు గనునిన్ దుర్కేశ భట్టీశ్వరా! 92

మ. పదిరెండున్ బదియారునై జెలగు నా ప్రఖ్యాత మంత్రంబులన్
బదపద్మంబుల సేవచే నిజగురు స్వామిన్ సమీపించి య
(47) భ్యుదయంబొందగ బ్రార్థనల్ సలిపి సాం గోపాంగమంత్రంబులు నె
మ్మదిగా బోధమునంది నిర్గనెద భీ మా విక్రమార్కేశ్వరా! 93

శా. బోయల్ నీ విమలప్రసాదమునకై మ్రొక్కోయనం దాన సా
హాయుండై బసవేశ్వరుండు గరళా హారంబు నీ కర్పగన్
జేయంగా శివభక్తులెల్లరును బ క్షింపంగ వీక్షించి నా
బోయల్ వోయిరి నీదు భక్తమహిమం బుజూచి భట్టీశ్వరా!94

శా. భీమా మంచనపండితుండు నమయుల్ భీతిల్ల గాశీపురీ
ధామున్ విష్ణుదృషత్స్వరూపుని నమ త్కారునింజేసె నో

స్వామీ శ్రీకర విశ్వనాథునకు దృ ష్టాంతంబుగా నేటికిన్
నీ మాహాత్మ్యముదృష్టిగోచరము తం డ్రీ విక్రమార్కేశ్వరా! 95

మ. శివభక్తుండగు పంచమాన్వయుని సం సేవింప భోగయ్య త
ద్భవులెల్లం బురినుండి బొమ్మనగ బో వన్ వానితో నా పురిన్
శివలింగంబులు పోర్లిపోవగ సుర జ్యేష్ఠాన్వయుల్ భీతిచే
స్తవముంజేయగ వానితో నిలిచె ను మ్మచ్ఛక్తి భట్టీశ్వరా! 96

మ. తలిదండ్రుల్ నియమింపగా సతము ము గ్ధత్వంబునన్ నీదు కో
వెలలో నుంచెడుపాలు నీ దరిని నై వేద్యంబు గావింప మె
చ్చి లలిన్ గైకొని యారగించి గొడగూ చి శ్రీ శిరోజంబు లీ
వలకుం గన్పడ నైక్యతన్ వెలసి త ప్పా విక్రమార్కేశ్వరా! 97

శా. శ్రీ చౌడయ్యను సాంఖ్యతొండనెఱుమా రిం గల్లిదేవయ్యనున్
శ్రీ చిట్టంబలు గోటయాఖ్యు గొడగూ చిన్ ముగ్ధసంగయ్యనున్
మాచయ్యన్ శ్వపచయ్యనుద్భటుని నా నాచయ్యవై జవ్వలన్
బాచయ్యన్ దలతున్ సతంబు ననుగా వంజాడుభట్టీశ్వరా! 98

శా. నీవే శ్రీ బసవేశ్వరుండవయి క్షో ణి న్నీదు భక్తావళీ
భావంబుల్ వికసింపజేసి మహిమన్ భాసిల్లగా జేసి నా
వే వారిన్నుతిజేయ జాలడు భుజం గేశుండ నన్ మాదృశుల్
గావింపం గలరే మహాత్మ నత శ క్రా విక్రమార్కేశ్వరా! 99

మ. సభలో జంగమమిండడొక్కరుడు నీ జాయాపటంబొల్చి నా
కభయంబొప్ప నొసంగుమన్న బసవం డర్ధాంగి పుట్టంబులన్
బ్రభలొప్పారగ నొల్వ నక్షయముగా వస్త్రప్రదానంబు నా
శుభగాత్రీమణికిచ్చి గాచితివటో శుభ్రాంగ భట్టీశ్వరా! 100

మ. సమయుల్ వేదమునన్ జయించుమనుచ ర్చన్ గల్లిదేవయ్య గా
రమితాస్థం దమసారమేయముల నీ రామ్నాయముంబల్కుడీ

సమయాంబాదన వేదమధ్యయన మాశ్చర్యంబుగాజేసి ది
గ్భ్రమనందించి జయించెనీకృప నవ క్రా విక్రమార్కేశ్వరా!101

శా. ప్రౌఢాత్మ్యాడను గామిని సహజ ని ర్వ్యాజానురాగంబు నా
రూఢజ్ఞాన మొసంగి కాచునని కో ర్కుల్ మీఱుచుండుంగదే
(48) మూఢాత్మున్ననుగావ భారమె కృపాం భోరాశివయ్యా వృషా
రూఢా నిదయ నాదు ప్రాప్తమిక నే గృపాజూతు భట్టీశ్వరా! 102

శా. ధీరుండన్ భవదీయ భక్తుఁడ మహా దేవాభిధానుండ గం
భీరాపార పయఃపయోధి సము పె న్మాత్మాన్వవాయుండ నా
చారోద్యద్వ్రత సక్తమానస లస త్సాన్వీయుణో భద్రమా
వీరబ్రహ్మ కనిష్ఠపుత్రుఁడను పృ థ్వీవిక్రమార్కేశ్వరా! 103

మ. భయముంబాపి సమస్తపాపముల వి ధ్వంసంబుగావించి సం
శయ విచ్ఛేదముజేసి దుర్భర పున ర్జన్మంబు లేకట్టి మ
(49) త్ప్రియముంగూర్చి భవత్పదంబును బ్రసా దింపంగదయ్యా నిరా
మయ నిర్దోషనిరంజనాఖ్య సతతాం బాపఖ్య భట్టీశ్వరా! 104

మ. పునుఁగుం గస్తురి మంచిముత్తెముల తాం బూలంబు నామంబు స
న్నని వస్త్రంబులు భూషణంబులును సా నందంబుగాదాల్చి మిం
(50) చిన దేహంబును బ్రాణముల్ విడువ ఛీ ఛీ యంచు గన్గొంచు ద
త్తనవుంగాల్తురె గాని హాతురెమహా త్మా విక్రమార్కేశ్వరా!105

శా. వక్షోజగ్రహణంబునం దలతు నా వక్షోరుహాకారునిన్
త్ర్యక్షున్ కామరతిం బ్రజాపతి సమా నాకారు విన్నింతు నా
(51) మోక్షాపేక్ష నెటుల్ జరింతు నిక శం భూ! నిన్ని రాకాపుగా
ఋక్షాధీశ శిరోవిభూష మదిలో నే నెంతు భట్టీశ్వరా! 106

శా. హాలిన్ క్షీరపయోధి నిర్మథన గా ధా చ త్పురాణంబునన్
లీలన్ హాలహలంబు శంకరుడు గ్రో లెన్ నామరంతాత్రి జే

వాలిన్ వీడదలంచు రుద్రపశుప । త్యాఖ్యుం దొడం జేర్చి నీ
నీలగ్రీవము జీల్చి జూపితివి తం । డ్రీ విక్రమార్కేశ్వరా! 107

మ. విశదంబేగద సత్వసంగతులు వి । న్పింపం బనేమింక దు
ర్దశలెల్లం దొలగించి మద్రచిత స । న్మత్తేభ శార్దూల ప
(52) ద్య శతగ్రంథ సమాదరంబున మదీ । యంబైన పాపౌఘ మె
ల్ల శమింపంగ ననుగ్రహింపగదె నీ । లగ్రీవ భట్టీశ్వరా! 108

మ విరతంబుం గరుభక్తి నీశతకమున్ । విస్తారరీత్యాత్మలె
యరయంగా విననన్ బఠించినను వ్రా । యం జూచిన న్పార్వతీ
వరమేశాజ్ఞ సమస్తమంగళములా । పద్మాగ్రి భాగ్యంబుగా
స్థిరమై యొప్పునటంచు నెల్లరకు ర । క్తిన్ విక్రమార్కేశ్వరా!109

మ. స్మయదూరా హర సర్వహార రజిత । శ్మాభృద్విహారా దరా
ని నుతిన్ నిన్ను స్మరించుటల్ గలిగె దా । నిం జూచిరక్షించు మ
(53) వ్యయమైనట్టి భవత్పదంబొసగి యో । భక్తానురాగోకహా
జయమృత్యుంజయ మంగళంబు గిరిసం । జాతేశ భట్టీశ్వరా! 110

సంపూర్ణము.

కం. ధీవిభవజతాత్ర్యనసూ, యా వీరబ్రహ్మ భద్ర । మాంబాత్మజడన్
భావాంబుజనిహిత మహా, దేవ మహాదేవ నామ । ధేయుడదలపన్.

(శ్రీ) (శ్రీ) (శ్రీ)



---

ఈ శతకమందు గల పద్యముల మొదట వేసిన సంఖ్య గల పద్యములు తత్వవిషయములు గలవిగా చదువరులు గ్రహింపవలెను.

గ్రంథకర్త

# శ్రీ సరస్వతీ ఆయుర్వేదాగారము

ఆలమూరు, తూర్పుగోదావరి జిల్లా.

"ఆయుర్వేదవిశారద" కె. వి. సూర్యనారాయణ అంధ్రబదిర్నవారిచే శాస్త్రీయముగా తయారు చేయబడిన సుప్రసిద్ధౌషధములు

## వసంత కుసుమాకరము

ఇయ్యది సమస్త ఆయుర్వేదీయఔషధములలో నత్యుత్తమమైనదని యెల్లరకు విశదమే. అతిమూత్రము, సమస్తమేహములు, శ్వాస, క్షయ, నరములదౌర్బల్యము, కుసుమ, పాండువు, మతిభ్రమము, రాచకురుపులు మొదలగునవి; ఇంక ఈవ్యాధి ఆవ్యాధి యననేల సమస్త వ్యాధులు ఎట్టి అపాయస్థితిలోనున్నను మూలచ్ఛేదముగావించి సంపూర్ణారోగ్యమును, వజ్రశరీరమును అగునట్లు చేయు ప్రభావము గలదని వర్ణించుటయుం దతిశయోక్తిలేదు. ఐశ్వర్యవంతులు, భోగప్రియులు సదా వాడదగిన ఔషధము. శరీరపుష్టి, వీర్యవృద్ధి, బలము, కాంతి, ఉత్సాహము గలిగించును. తులం రు **16—0—0**

## శ్రీ సరస్వతీ తైలము

ఈ తైలరాజము సరస్వతీ ఉసిరిక ఇత్యాది అనంతగుణభూషితమగు యోషధరాజములచే తయారుకాబడినది. దీనిని తలకురాయుటవల్ల శిరస్సునందలి ఉష్ణముతగ్గించి, యున్మాదము, భ్రమ, శిరస్సుపోటు, కండ్లమెరుపు, మసక వీటిని హరించి జ్ఞాపకశక్తి హెచ్చించుటయందు గలప్రభావమును న్యాయవాదులును, విద్యార్థులును అనేకయోగ్యతాపత్రము లొసంగిరి. 3 ఔన్సుల సీసా రు **0—12—0**

షరా:—సమస్త ఆయుర్వేదీయమైన ఔషధములు శాస్త్రీయముగా చేయబడినవి. సరసమైన ధరలకు దొరకును. అన్నివ్యాధులకు చికిత్స మావద్ద చేయబడును.